కామమటు లయంబు
కడు పనర్థకము
కాన చిత్తలయంబు
గానీయరాదు. 30

చిత్తము; లయమును
జెందు సుషుప్తి
అది నిగ్రహంబున
నలయమైయుండు. 31

అలయసిద్ధికి మది
నభ్యసింపనగు
నలయమనంబున
కాత్మగమ్యంబు. 32

లయమునుండి మదిని
స్వయముగాలేపి
ఆత్మయందున జేర్చ
నగు దానినంత. 33

ఆత్మదర్శనమున
నాత్మలోనున్న
స్థిరమైనమనమది
చెదరదెన్నటికి. 34

అహము లేనిది విల
యంబునొందనిది
యైన చిత్తమెసంవి
దైక్యంబుగలది. 35

స్వప్న నిద్రలు లేని
స్వస్థచిత్తంబె
సర్వోత్తమంబైన
సత్తపః ఫలము. 36

స్వప్న సుషుప్తులు
జననంబు లేని
మనమదిబొందును
తన నిజ రూపు. 37

స్వాత్మబోధకసూక్తి
జాలకమిద్ది
శ్రీనివాస కృతంబు
చిదుపదేశంబు. 38

జ్ఞాననిష్ఠా ప్రకరణము సమాప్తము
శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచియింపఁబడినది.

---

శ్రీరామాయ నమః

# అనుష్ఠాన దర్శనము

## 16. ఆత్మనిష్ఠా ప్రకరణము

నేను నేననిదోఁచు
నే నెవ్వఁడనని
తాను తన్వేదుకంగ
తనరూపుదోఁచు. 1

దృష్టికి ద్రష్టయౌ
దృక్కైచిదాత్మ
దృష్టి సాధనమున
దృక్కుగన్పట్టు. 2

బుద్ధీంద్రియంబుల
పోకడనుడుప
శ్రద్ధాన్వితునకబ్బు
శుద్ధాత్మదృష్టి. 3

చిత్తంబు నిలుపక
చేచేలకైన
చిత్తునఁ జిత్తంబు
చేర్పంగరాదు. 4

జ్వరపీడితుండిల
శర్కరనట్లు
విరతి విహీనుండు
విమలునివిడుచు. 5

శుద్ధదర్పణమట్లు
శోభిల్లకున్న
బుద్ధికంతర్దృష్టి
బొదలదెన్నటికి. 6

సూక్ష్మమౌ మదిమును
సూక్ష్మదర్శనులు
సూక్ష్మాతి సూక్ష్మమౌ
శుద్ధాత్మగనిరి. 7

బుద్ధి సూక్ష్మాకృతి
బొదలదేని పరి
శుద్ధమౌ నీయాత్మ
శోధింపఁబడదు. 8

నిద్రయు స్మరణంబు
నిత్యాత్మనిష్ఠ
భద్రతకునుగూర్చు
భయమునిజంబు. 9

ఉహామపేతకమగు
యాత్మప స్థి
మోహానిద్రాజ్ఞాన
మూఢాదులడ్డు. 10

ఆత్మాచలంబెక్క
నరుగుటకొక్క
స్వా ప్రబోధ వి
జ్ఞానమే మెట్టు. 11

వినుతాత్మనిష్ఠను
విసువులేకుండ
మనుజుఁడనుష్ఠింప
మునుకొనుకొఱకు. 12

మాననీయంబైన
మహితాత్మనిష్ఠ
శ్రీనివాసుఁడు చెప్పె
చిత్తు సాధనము. 11

ఆత్మ నిష్ఠాప్రకరణము సమాప్తము
శ్రీరామకృష్ణ సోదరుఁడగు
శ్రీనివాసునిచే రచియింపఁబడినది

---

ఓం.

శ్రీరామాయ నమః.

# అనుష్ఠాన దర్శనము

## 17. సహజ నిష్ఠాప్రకరణము

తాను లేకున్న దా
    ద్రష్ట యెట్లగును
తానెన్న తనరూపు
    దాస్వస్థుఁడగును. 1

తనువుకు ద్రష్టయై
    తానున్న యెడల
తను తాపమెన్నఁడు
    తనకుండబోదు. 2

మనసుకు ద్రష్టయై
    మరువకయున్న
మనసు చలించదు.
    తన తావునుండి. 3

నేనను వృత్తిని
    నిష్ఠతోనరయ
నేననునదియె న్వ
    స్థానమునబడు. 4

మరపును నిద్రను
మరువక యున్న
స్థిరమైన నిలుకడ
జేకురు నిజము ॥ 5

ద్రష్టుత బుట్టినా
స్థానము వెదుక
స్వస్థలంబున గల్గు
సంస్థితి దనకు 6

స్వ తిగనియుచ్చు
సంస్థితియందు
స్వస్థతం బడసిన
బనిలేని వాఁడు ॥ 7

సహజసంస్థితికి నీ
సాధనక్రమము
మహి శ్రీనివాసుండు
మహితమార్గము నె ॥ 8

సహజనిష్ఠాప్రకరణము సమాప్తము

శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచియింపఁబడినది.

---

శ్రీరామాయ నమః.

# అనుష్ఠాన దర్శనము

## 18. అనుభూతి షష్ఠప్రకరణము

నేను దేహముగాను
కానింద్రియములు
నేను సద్రూపుండ
నేను చిద్ఘనుండ ॥ 1

నేను ప్రాణముగాను
నేబుద్ధిగాను
నేను సద్రూపుండ
నేను చిద్ఘనుండ ॥ 2

నేనహంకృతిగాను
నేగాన విద్య
నేను సద్రూపుండ
నేను చిద్ఘనుండ ॥ 3

నేను కర్తనుగాను
నే భోక్తగాను
నేను సద్రూపుండ
నేను చిద్ఘనుండ ॥ 4

నాకు జన్మము లేదు
నాకు లేదు మృతి
నాకు లేదు భయంబు
శోకము లేదు, 5

నాకు మోహాము లేదు
నాకు లేదు రుజ
కాదు పిపాస లే
దాకలి లేదు!॥ 6

నే నిర్వికారుండ
నే నిశ్చలుండ
నేను నిర్గుణుండను
నే నసంగుండ ॥ 7

నే నవ్యయుండను
నేను వ్యాపకుండ
నేను నిరమయుండను
నేను నిర్మలుండ॥ 8

నే నిరవద్యుండ
నేను నిత్యుండ
నే నఖండుండను
నే నిరంజనుండ ॥ 9

నే నద్వితీయుండ
నే ననంతుండ
నే నిత్యసత్యుండ
నే నిరామయుండ ॥ 10

నేనె పరంజ్యోతి
నే పరాత్పరుండ
నేను నిర్దుఃఖుండ
నే చిన్మయుండ ॥ 11

నిరతిశయసుఖుండ
పురుషోత్తముండ
పరమాత్ముండను నేను
ప్రత్యగాత్ముండ ॥ 12

సర్వకారణుండ నే
సర్వసముండ
సర్వసాక్షిని నేను
సర్వగతుండ ॥ 13

అప్రమాణుండ నే
నద్వితీయుండ
అప్రమేయుండ నే
నాగమోక్తుండ ॥ 14

నేను నిర్ద్వంద్వుండ
నేను నిష్క్రియుఁడ
నేను నిర్ముక్తుండ
నే జ్ఞానఘనుఁడ ॥ 15

తన నెఱింగినవాని
యనుభూతి నిష్ఠ
యని శ్రీనివాసుండు
వినిపించెదేని ॥ 16

అనుభూతి నిష్ఠాప్రకరణము సమాప్తము
శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచయింపఁబడిన అనుష్ఠానదర్శనము సమాప్తము

ఓం తత్సత్

---

# అనుష్ఠాన దర్శనము

## పరిశోధనపత్రము తప్పొప్పుల పట్టిక

| పేజీ | పద్యసంఖ్య | పాదము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 1 | 3 | 1 | చెడిపోప | చెడిపోవ |
| 9 | 6 | 2 | వరత | పరత |
| 10 | 11 | 1 | కొనియష్ఠా | కొనియనుష్ఠా |
| 11 | 1 | 3 | సరా | పరా |
| 11 | 3 | 1 | ధీమావస | ధీమానస |
| 12 | 6 | 2 | మనముందు | మనముండు |
| 12 | 8 | 4 | దమరయంత | దమయంత |
| 13 | 10 | 1 | చిత్తంవొందె | చిత్తంబొందె: |
| 13 | 10 | 3 | స్వస్థుఁడుగాదేని | స్వస్థుఁడుగాదేవి |
| 17 | 1 | 4 | బగతి | జగతి |
| 53 | 33 | 1 | భగకుంతు | భగవఁతు |
| 58 | 2 | 1 | జ్ఞానమొక్కఁడె | జ్ఞానమొక్కఁటె |
| 65 | 16 | 2 | తానుగ | తానుగా |
| 71 | 10 | 4 | సాధకుటొందు | సాధకుఁడొందు |
| 75 | 30 | 2 | సనర్థకము | ననర్థకము |
| 79 | 10 | 2 | యాత్మసంస్థి | యాత్మసంస్థితిక |
| 83 | 6 | 3 | కామపిపాస | నాకుపిపాస |
| 83 | 8 | 4 | నేచు | నేను |

# ప్రబుద్ధగీత

ఓం

శ్రీరామాయ నమః

సద్గురుభ్యో నమః

# ప్రబుద్ధగీత



ధీంద్రియమున కెవం డధీశుఁడై జీవుని
బంధమునకు మోక్ష పదమునకును
కారణుండు నయ్యె. ఘనునా రఘూద్వహు
భవభయంబుఁ బాపఁ బ్రస్తుతింతు. 1

చిన్ననాఁటనుండి చిత్తమెవ్వనిపాద
పద్మమున్నఁ బూర్ణ భక్తి నెఱపు
నమ్మహాత్ము నాదునగ్రజు శ్రీరామ
కృష్ణగురుఁ, బ్రబుద్ధ హృదయు నెంతు. 2

శ్రుతిపథం బెఱింగి హితమతి వేదాంత
వీథి నరుగ భవము వీడు నంచు
విజయశంఖ మొత్తి విశ్వగురుస్థాన
మాక్రమించు శంక రార్యుఁ దలఁతు. 3

వీతరాగులకును విజితేంద్రియులకును
విగత మత్సరులకు విజులకును
మోహ శోక భయ ముక్త మానసులకు
మాన్యచరితులకు నమస్కరింతు. 4

అని యిట్లు దేవ గుర్వాచార్య సాధు సజ్జనంబులకు నమస్కరించి ;

సత్యనియతి సర్వభూతహితం బహి
రిగ్రహంబు ధీవినిగ్రహంబు ;
చౌర్యరహితవృత్తి, శౌచ, మాస్తిక్యంబు,
త్రికరణములశుద్ధి, తెలువ గలిగి. 5

స్వార్థచింత లేక - సర్వేశుకృప తన
కబ్బినంతె గొనుచు నిబ్బరంపు
హృదయమున సతంబు విషయములఁ జడియక
స్వాంత మీశునందుఁ జక్కఁ జేర్చి. 6

ధీనియంత్రుకరుణ దీపింపఁ బురుషోత్త
మాఖ్యు దేవదేవు ననుదినంబుఁ
బూజ సేయఁ జేయఁ బొడమిన పుణ్యాతి
శయముచే వివేక నయన మొప్ప. 7

శమదమాది షట్క సంపత్తి వైరాగ్య
మమృతపదవి నొంద నాతురతయు
హృదయమున జనింప మొదలంట సంసార
తరువుఁ గూల్చు జ్ఞాన పరశువునను. 8

జ్ఞాన మెద్ది? దాని సాధనక్రమ మెద్ది?
స్వానుభవము నొక్క సరణి యెద్ది?
అని విచారమగ్ను లయి మార్గ మెఱుఁగని
సాధకులకు విమల బోధ గఱప. 9

జ్ఞాని యనుభవంబు మానుగ నే నీ ప్ర
బుద్ధ గీతయందుఁ బొందుపఱతు
ముక్తి యన్న మనసు మునుకొను మనుజుండె
శ్రద్ధతోడ దీనిఁ జదువుఁగాత. 10

## ప్రబుద్ధవచనము

నేను నే ననుటన్న నేని కర్థంబను
నాత్మచింతనమున నహముకన్న
నన్యమైన సచ్చిదా యే నేనను
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 1

ఎఱుఁగఁబడున దెల్ల నెఱుఁగెడి దానికి
నన్యమై వెలుంగు ననెడి యుక్తి
తను హృషీకతతులు తాను గా దనియెడు
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 2

ఎఱుఁగు దానిధర్మ మెఱుఁగంగఁబడ దను
సూక్ష్మతత్త్వ మరసి సుఖము దుఃఖ
మాత్మయం దొకప్పు డైనను లేవను
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 3

ఎఱుఁగఁబడెడిధర్మ మెఱుఁగంగఁబడదు దాని
తనెడి యుక్తివలన నాత్మయందు
ఎఱుఁగఁబడున దెన్నఁ డెద్దియు లేదను
నిజ మెఱింగినాఁడ నేఁడు నేను. 4

ఆత్మవేత్తయైన నపరిగ్రహము వీడి
వస్తుసంగ్రహైక పరత నున్న
చిత్తువిడిచి తనువు పొత్తుఁగోరుట యని
విడిచినాఁడ దాని విధిగ నేను. 5

మేనితోడిసుఖము మానిన మనుజుండె,
మేన నాత్మబుద్ధి మాన నేర్చు
మేనిసుకమటన్న మెయితలంపే యని
విడిచినాఁడ దాని విధిగ నేను. 6

గౌరవమున దృష్టి గలిగినవారికిఁ
గాయమందు దృష్టి కలుగు నంచు
పూజలందుకొనుట పూర్ణమనంబున
విడిచినాఁడఁ దొలుత విధిగ నేను. 7

పరులు నిందసేయఁ బలుకంగరా దిఁకఁ
బూజఁ జేసినంత పొంగరాదు
వీని విడువ మమత వీడు మేన నటంచు
విడిచినాఁడ దాని విధిగ నేను. 8

తనువునందుఁ దనకుఁ దమకె మున్నప్పుడే
సతులు సుతులు హితులు సంపదలును
తమకె ముదుగ మేన మమత లెక్కుడిదని
విడిచినాఁడ దాని విధిగ నేను. 9

చప్పులవంకఁ బోవ సన్న్యాసియైనను
రసమునందె మిగుల రక్తుఁ డగును;
రసము విడువఁజేసి రాగంబు చెడ దని
విడిచినాఁడ దాని విధిగ నేను. 10

విషయ చింతనముల విలసిల్లఁజేసెడి
వచనములను వినుచుఁ బలుకుచున్న
యోగినైన నవియె భోగిఁ జేయు నటంచు
విడిచినాఁడ దాని విధిగ నేను. 11

వపువునకె తలంప వైరిగణంబులు
వపువు కాని నాకు వైరు లెవరు?
వైరిబుద్ధియున్న వపువుధీ చెడ దని
విడిచినాఁడ దాని విధిగ నేను. 12

తనువు కానటంద్రు ధనమును గూర్తురు
తనువు కానినాఁడు ధన మిఁకేల?
తత్త్వతనువులందు తనువుదే ధన మని
విడిచినాఁడ దాని విధిగ నేను. 13

నింద్యమౌటఁ దనువు నిందింత్రు లోకులు
నింద చేసి రంచుఁ గుందనేల?
తనువు కానినాకుఁ దమకె మేల యటంచు
విడిచినాఁడ దాని విధిగ నేను. 14

మేను నేనటన్న మేకొనుఁ గష్టంబు
మెయితలంపు వీడ మేలు గలుగు
మేలుగోరునతఁడు మేను నే ననఁ డని
విడిచినాఁడ దాని విధిగ నేను. 15

వపువు సుఖములందు వలపు నడంచిన
మెయితలంపు వీడి మెలఁగ నేర్చు;
వలపు లుండువఱకుఁ దలఁపు వీడ దటంచు
విడిచినాఁడ వాని విధిగ నేను. 16

దేహబుద్ధి భేద బుద్ధి నొసంగును
భేదబుద్ధి నరుని భీరుఁ జేయు!
పోలయ భయము దేహ బుద్ధి పోవలెనని
విడిచినాఁడ దాని విధిగ నేను. 17

తత్త్వవేత్త ననెడు తలఁపైన నరునకు
మేని తమకమునని మెయికొనునని
తలఁపు వీడవలయు తత్త్వవేత్త కటంచు
విడిచినాఁడ దాని విధిగ నేను. 18

వేయిమాట లేల విశ్వంబులో 'నేను'
'నాది' యనెడి తలఁపు పాదుకల
విడువఁదగినవానిఁ దడవుసేయక వేగ
విడిచినాఁడఁ దొలుత విధిగ నేను. 19

విధినిషేధ ప్రకరణము
సమాప్తము
ఓం తత్సత్

ఓం

శ్రీ రామాయ నమః

# అభ్యాస ప్రకరణము

శమదమాది సుగుణ సంపత్తి లేకున్నఁ
జిత్త మాత్మయందుఁ జేరదనుచు
స్వస్థచిత్తమొంద సాధనసంపత్తి
నభ్యసించినాఁడ నంత నేను. 1

ఆత్మయందు మనము నట్టి నిల్పుదమన్న
నాత్మగాని తనువు లడ్డమగుట
తనువులెల్ల దాఁటి తత్త్వంబుఁ జేరంగ
నభ్యసించినాఁడ నంత నేను. 2

చెప్పికొనుట వినుట చింతించుట తదేక
నిష్ఠ నాత్మపరత నిలుచుటయును
జ్ఞానమునకు ముఖ్య సాధనం బని దీని
నభ్యసించినాఁడ నంత నేను. 3

ప్రతినిమేషమందు పరతత్త్వచింతను
సలుపవలయు నహము సమయునటుల
తత్త్వబోధ పూర్ణతను బొందుకొఱకని
యభ్యసించినాఁడ నంత నేను. 4

చిత్తు నే నటంచుఁ జెప్ప నేర్చిన నాఁడు
చిత్తు కానివాని పొత్తదేల?
చిత్తుతోనె మనము పొత్తింప వలెనని
యభ్యసించినాఁడ నంత నేను. 5

చిత్తువిడచి మనసు చేరెనా యన్యంబు
చిత్తునం దదిమఱి చేరఁజనదు
కానఁ జిత్తమెప్పుడు కడు మెలంకువ నుండ
నభ్యసించినాఁడ నంత నేను. 6

ధీని గెలువరాదు ధీరభావము లేక
దీని గెలువకున్న దేహబుద్ధి
విడువ రాదటంచు విధిగను ధీరత్వ
మభ్యసించినాఁడ నంత నేను. 7

తనువు గానటంచుఁ దలఁచిన ఫలమేమి
తనుకి మదుగకున్న తనువునంద
టుంచు మేనతలఁపు ద్రుంచఁగ నెమ్మది
నభ్యసించినాఁడ నంత నేను. 8

తనువునకును గష్ట తతులొనఁగూడిన
తనువునందుఁ దలఁపు దగులకుండ
తలఁపులందు నేనె తత్త్వమైతి నటంచు
నభ్యసించినాఁడ నంత నేను. 9

చిత్త మొక్కక్షణము చిన్మయి విడిచిన
తనువునందుఁ దలఁపు తత్క్షణంబె
యుద్భవించు నంచు నోరిమిఁ జిద్వృత్తి
నభ్యసించినాఁడ నంత నేను. 10

వ్యాధు లొదవునాఁడు వైరి పైకొనునాఁడు
మరణభయము కలఁత పఱచునాఁడు
దేహబుద్ధి విడుచు ధీ గల్గవలె నని
యభ్యసించినాఁడ నంత నేను. 11

ఒంటి దిరుగునాఁడు నురగంబు గనునాఁడు
వ్యాఘ్రవృశ్చికాళి వంకఁ బోవు
నాఁడు గూఁడ దనువు నాదను మది చెడ
నభ్యసించినాఁడ నంత నేను. 12

చిత్తునందు మనసు చేరను విడుచును
తలఁపు తనువునుండి తొలఁగువఱకు
దేహదృష్టి చెడిన రహసు మన మని
యభ్యసించినాఁడ నంత నేను. 13

చూపు లోని కేఁగ శుద్ధాత్మనితలంపు
బాహ్యమునకు నేఁగ బ్రహ్మబుద్ధి
యుండవలయు నంచు నోపికఁ దద్వృత్తి
నభ్యసించినాఁడ నంత నేను. 14

ఆత్మమాత్ర మఖిల మను బోధ కవధి స
ర్వం బఖండ చిత్సుఖంబు గాఁగ
నిండుమనముతోడ నుండుటే యని; దీని
నభ్యసించినాఁడ నంత నేను. 15

బ్రహ్మ మైతి ననెడు పరిపూర్ణబుద్ధికై
లో వెలికిని చిత్త లోచనంబు
సంచరింపకుండ సత్తునందే చేర్ప
నభ్యసించినాఁడ నంత నేను. 16

ఆదియందె దాఁటి యద్దంబు లన్నింటి
నా బు కోఱకు నహరహంబు
దేహంబు విడువ ధీచేత మెల్లఁగ
నభ్యసించినాఁడ నంత నేను. 17

ఆత్మ గానిదాని నవలఁ ద్రోచుటయును
నాత్మబుద్ధితోడ నలరుటయును
ఏక కాలమందె యేర్పడవలెనని
యభ్యసించినాఁడ నంత నేను. 18

వెలికి లోని కనెడు వెత లెల్లఁ దీఱఁగాఁ
జిత్తునందు మనము చేరియుండెఁ
జిత్తునందుఁ దోఁచు చిత్రమే జగ మని
యెఱిఁగి దానివంక కరుగ నేను. 19

అభ్యాస ప్రకరణము సమాప్తము

శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచియింపఁబడిన

ఓం తత్సత్

ఓం

శ్రీ రామాయ నమః

# స్థితప్రజ్ఞప్రకరణము

జ్ఞాన మొదవుటచేత నజ్ఞాన మణఁగ
తనువునందున్న నేనను తలఁపు దొలఁగ
చిత్తు నేనైతినని చిత్తుఁజేరినట్టి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 1

తనువు నేనైతినని మదిఁదలఁచినపుడు
తనువు విడనాడి చిత్తును దలఁపదాయె
చిత్తు నే నైతినని చిత్తుఁజేరి నేఁడు
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 2

కాయమున కెన్ని క్లేశముల్ గలుగుచున్నఁ
గాయమును నేను గానని కడకుఁద్రోసి
చిత్తునేనైతినని చిత్తుఁజేరినట్టి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 3

'నాది' 'నే' ననునట్టి యనాదియైన
మాయసంసారమున భ్రమల్ మాసిపోవ
చిత్తు నేనైతినని చిత్తుఁజేరినట్టి
చిత్త మేఁగదు చిన్మయు చెంతవిడిచి. 4

దారలుం బుత్రులును ధన ధాన్యములును
భోగభాగ్యంబులును బరిపూర్ణములుగఁ
జేరియున్నను జిద్రూపుఁ జేరినట్టి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 5

మేను వ్యవహారపరతను మెలఁగుచున్న
స్త్రీజనంబులమధ్యను తిరుగుచున్న
వపువునం దభిమానంబు వదలినట్టి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 6

గంధమాల్యాంబరంబుల గాత్రమునకు
సంతతంబును బూజలు జరుగుచున్న
పూలపాన్పున దేహంబు పొరలుచున్నఁ
జిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 7

ఇంద్రభోగంబులం బోలు నీప్సితముల
నెన్ని చేకూర్చి కూర్మితో నిత్తునన్నఁ
జిత్స్వరూపంబునందునఁ జేరినట్టి
చి మేఁగదు చిన్మయు చెంతవిడిచి. 8

అనయము ప్రియాప్రియంబులు తనువునందు
దగులమొందిన బుద్ధికిఁ దగులుగాని
చిత్సుఖంబగు నాఁ కిఁకఁ జెందవనుచు
జిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 9

గాలి యెండయు వానయు గాత్రమునకు
గాసి గలిగించుచున్నను గాసి యనక
గాత్రమును నన్యగాత్రంబు కరణిఁ జూచి
చిత్త మేఁగదు చిన్మయు చెంతవిడిచి. 10

పెంటకుప్పలయందును బెరడులందు
బూదిగుడిసెల యందును బొలములందు
మేను దొరలుచునున్న నమ్మౌని మఱచి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 11

కఠిన శిలలందు సెలయేళ్ల గట్టులందు
శైలగహ్వరములను దేవాలయముల
మేను చీకాకుపడి సంభ్రమించుచున్న
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 12

కట్ట జీర్ణాంశుకంబైనఁ గలుగకున్నఁ
గుడువ నన్నంబు తనకుఁ జేకూరకున్నఁ
బీడ లెన్నెన్ని తనువునఁ బెరుగుచున్నఁ
జిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 13

మృత్యుదేవత చనుదెంచి యెదుటనిలిచి
తనకు హానిని గూర్పంగఁ దలఁచుచున్న
చిత్తునేనైతి నని చిత్తుఁ జేరినట్టి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 14

వపువు మిత్రులయం దరివర్గమందు
నాత్మవిదులం దవిద్యావృతాత్ములందుఁ
దిరుగుచును బహుక్రీడలఁ దేలుచున్న
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 15

బుద్ధివృత్తుల ననిశంబుఁ బూర్ణముగను
బోధమాత్రస్వరూపమై పొదలుచున్న
చిత్తు నేనైతినని చిత్తుఁ జేరినట్టి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 16

మాన మవమాన మనియెడు మాటలేదు
సుఖము దుఃఖము ననియెడి చూడ్కిలేదు
నిరతిశయమైన సుఖమున నిలిచినట్టి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 17

ముక్తకంచుకముం దను రక్తిలేని
విషధరముఁబోలి మమకార విరహితమగు
తనువు నందిఁకఁ దమకంబు తగదటంచుఁ
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 18

ఇన్నిజన్మంబులకు హేతువేది యనినఁ
దనువునందలి తమకమేయని సతంబుఁ
దలఁచి యీనాఁడు మేల్కొని తత్త్వమరసి
చిత్తమేఁగదు చిన్మయు చెంతవిడిచి. 19

తత్ప్రజ్ఞ ప్రకరణము సమాప్తము

శ్రీరామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే రచియింపఁబడినది

ఓం తత్సత్

ఓం

శ్రీ రామాయ నమః

# ద్వంద్వాతీత స్థితి ప్రకరణము



నిరతిశయమైన ప్రీతికి నిలయమైన
నిత్యసుఖరూపమందట్టి నిలిచెబుద్ధి
దుఃఖరహితత్వంబొంది తుష్టిఁ జెంది
యున్నవాఁడ నిజత్వంగన్ననేను. 1

నిర్వికల్ప స్వరూపంబు నిర్మలంబు
చిత్తవృత్తి విహీనంబు చిన్మయంబు
నైన నాయందు నే నిల్చి హాయిగాను
నున్నవాఁడ నిజత్వంగన్ననేను. 2

తల్లిదండ్రులు తనయులన్ తలఁపులణఁగె
జననమరణంబులను భ్రమల్ సమసిపోయెఁ
జింతఁ దొలఁగిన మనమున సంతసమున
నున్నవాఁడ నిజత్వంగన్ననేను. 3

అహము మొదలుగ తనువుతో నంతమైన
జడము నేగాను గనఁగ నజడమె యగుదు
ననుచు జడముల నభిమాన మట్టె విడిచి
యున్నవాఁడ నిజత్వంగన్ననేను. 4

ఈవియం దిసుమంతైన నిచ్ఛ లేదు
పుచ్చుకొననైనఁ గోరిక పుట్ట దెపుడు
ఇచ్చునెడఁ బుచ్చుకొనునెడ నిచ్ఛ లేక
యున్నవాఁడ నిజ తిం గన్న నేను. 5

మౌననియమమునం దుండ మనసు లేదు
వాగ్మినై యుండవలెనను వాంఛ లేదు
మౌనినై వాగ్మినై యుంట మాని యెపుడు
నున్నవాఁడ నిజ తిం గన్న నేను. 6

చేయఁదగు కార్యమిదియని చేయఁబోను
విడువఁ దగినదియని మరి విడువఁబోనఁ
చేయుటయు మానుటయు నను చేష్టలుడిగి
యున్నవాఁడ నిజ తిం గన్న నేను. 7

పలుకవలె సత్యమంచు నేఁ బలుకఁబోను
విడువవలె ననృతంబని విడువఁబోను
సూనృతాసూనృతంబులఁ జూడ కెపుడు
నున్నవాఁడ నిజ తిం గన్న నేను. 8

భోగముల నొందవలెనని పొందఁబోను
విడువవలె భోగములనంచు విడువఁబోను
పొందుటయు మానుటయు నను పూన్కి లేక
యున్నవాఁడ నిజ తిం గన్న నేను. 9

ధనము గూర్పంగవలెనంచుఁ దలఁపఁబోను
విడువవలె నంచు మరి దాని విడువఁ బోను
ధనము గూర్పంగ విడువంగఁ దలఁపు లేక
యున్నవాఁడ నిజస్థితిం గన్న నేను. 10

ఆత్మయందట్టి శోకమోహముల నూపి
గాసిపడు మూఢుఁ డజ్ఞాన కలితుఁడగుచు
చిత్తధర్మంబు లని వాని చింత లేక
యున్నవాఁడ నిజ తిం గన్న నేను. 11

తత్త్వబోధామృతముఁ ద్రావి తన్మయతను
చిత్తము లయింపదానైనతత్త్వమందె
తనకు నన్యము గలదను తలఁపు లేక
యున్నవాఁడ నిజ తిం గన్న నేను. 12

పుట్టగోచికి కఱవయ్యుఁ బొంద వ్యథను
చీనిచీనాంబరములచేఁ జెంద ముదము
మంచిచెడ్డలఁ బరికించు మనసు లేక
యున్నవాఁడ నిజ తిం గన్న నేను. 13

కఠినశిలలందు శయనించి గాసిఁ బొందఁ
బూవుసెజ్జఁ బరుండియుఁ బొరయ సుఖము
కఠినమని మెత్తఁదనమని కనని తిని
నున్నవాఁడ నిజ తిం గన్న నేను. 14

ఓం

సద్గురుభ్యో

ధ్యాన శ

కం॥ హృదయాంతర్గతు డగుచును
హృదయ తమంబెడల నడిపి
బొదవింపజేయు రఘుకులు
పదయుగళం బెంతు జ్ఞాన వ

కం॥ శ్రుత్యర్థమెల్ల పరమా
ద్వైతంబని కారికలను త త్త్వ
హితమతి వివరించిన యా
మతిమంతుని గౌడపాదు మ

కం॥ గోవింద పూజ్యపాదుని
భావించి మనంబులోన శరగ
సేవింతు శంకరార్యుని।
భావంబున నాత్మబుద్ధి ప్రభ

కం॥ హస్తామలకాదులను ప్ర
శస్తులునౌ బ్రహ్మవిదుల స
న్యస్తుల శంకరశిష్యుల।
న్యస్తరజస్తముల విన

ఓం

## సద్గురుభ్యోనమః

## ధ్యానము

హృదయాంతర్గతు డగుచును
హృదయ తమంబెడల నడిపి యెడద వివేకం
బొదవింపజేయు రఘుకులు
పదయుగళం బెంతు జ్ఞాన వహ్నార గుల్పన్ 1

శ్రుత్యర్థమెల్ల పరమా
ద్వైతంబని కారికలను తత్త్వంబెల్లన్
హితమతి వివరించిన యా
మతిమంతుని గౌడపాదు మదినర్చింతున్॥ 2

గోవింద పూజ్యపాదుని
భావించి మనంబులోన వరయోగీంద్రున్
సేవింతు శంకరార్యుని।
భావంబున నాత్మబుద్ధి ప్రభవింపంగన్ ॥ 3

హస్తామలకాదులను ప్ర
శస్తులనౌ బ్రహ్మవిదుల సర్వజ్ఞుల స
న్యస్తుల శంకరశిష్యుల।
న్యస్తరజస్తములఁ వినమ్రత గొలుతున్॥ 4

ఓం

శ్రీ రామాయనమః

సద్గురుభ్యోనమః

# పరమార్థదర్శనము

తే॥ గీ॥ నేతినేత్యాది వాక్యముల్ – నేతినేతి
యంచు కల్పితములనిషే – ధించి దేని
కల్పితముగాని దని కట్టు – కడకుఁ దేల్చె
నట్టి ప్రత్యక్స్వరూప చి – దాత్మ నేను॥

తే॥ గీ॥ తత్త్వమస్యాది వాక్య తా – త్పర్యమైన
బ్రహ్మచైతన్య మెయ్యది – ప్రత్యగాత్మ
యని యహంశబ్ద లక్షిత – మై తనప్ప
నదియె నేనౌదు కా నహ – మాదికంబు। 2

తే॥ గీ॥ అహమహమటంచు స్ఫూర్తియౌ – నహమునందు
జ్ఞేయభాగంబు విడువ – నజ్ఞేయమైన
నమే యాత్మయంచు సు – జ్ఞానమతిని
రసినాయంత నేనుంచు సహముబాసి ॥ 3

తే గీ॥ జ్ఞాతజ్ఞేయంబుగామిచే – జ్ఞప్తిరూపు
డైన యాత్మకు జ్ఞేయంబు – లైన తనువు
లన్యమై యుండ నవియెట్టు – లాత్మయగును
తనువులకుగాను వానికి ద్రష్టనగుదు॥ 4

# పరమార్థదర్శనము

తే॥ గీ॥ ఈకనంబడు నానాత్వ మెల్లజూడ
బ్రహ్మమందున మాయచే ప్రభవమొందె
నాస్తిసర్వంబు నరయంగ నాస్తినాస్తి
యంచు శ్రుతులును బల్కవే యార్తిదీర॥ 10

తే॥ గీ॥ శ్రుతుల బరికించి చూడంగ శ్రుతముగాదె
బ్రహ్మమందున మాయచే భవమటంచు
యుక్తినరయంగ నదియును యుక్తమయ్యె
సత్యమెట్లగు బరికింప జగమిదెల్ల॥ 11

తే॥ గీ॥ సత్తుహేతువ్వయైన యసత్తులేద
సత్తుహేతువ్వయైనట్టి సత్తులేద
సత్తుహేతువ్వయైన యసత్తులేద
సత్తుహేతువుగాగల సత్తులేమి॥ 12

తే॥ గీ॥ ఎటుల తర్కించి చూచిన నిట్టులనుచు
కార్యకారణ నియమంబు కానబడమి
పుట్టుకయటన్న నది వట్టిమాటయంటె
లేదుపరమార్థదృష్టిని లేదుభవము॥ 13

తే॥ గీ॥ జాతిగలదని వాదింప జాలునెడల
జాతికిని కారణంబును చాటవలదె ?
కారణములేక కలుగునె కార్యమరయ
కార్యకారణములు యుండ గలవె యొకట॥ 14

# పరమార్థదర్శనము

తే॥ గీ॥ హేతువెయ్యదియని మును యెంచబడెనో
అదియె ఫలమయి తదుపరి నమరుచుండె
ఫలము నటువలే హేతువై బరగుచుండ
హేతుఫలములు కాదె యహేతుకంబు ॥ 15

తే॥ గీ॥ హేతుఫలముల నిర్ణయం బెఱుగరామి
జాతిలేదని వేఱె యెంచంగవలెనె
హేతుఫలములు సత్యంబు లె యటన్న
హేతుఫలముల నిర్ణయం తేలలేదు ॥ 16

తే॥ గీ॥ ఈజగంబున దోచునీ హేతుఫలము
లిట్టివి యటంచు జెప్పంగ నెరుగరామి
మాయచేతనె సృష్టి సంభవ మటంచు
నిజమెఱింగిన యార్యుల నిర్ణయంబు ॥ 17

తే॥ గీ॥ స్వీయముగానైన నితరంబు వల్లనైన
నెట్టివస్తువు యైనను నెట్టులైన
జననమందదు నటుల యసత్తు సత్తు
తలప సదసత్తు పుట్టుక తగనివగును ॥

తే॥ గీ॥ పుట్టుకయె సంభవింపమి నెట్టులైన
జీవులకు పుట్టువుల్ మరి జెప్పరాదు
జీవులంచరు నజులౌట జీవులకును
కారణంబును నరయంగ గానరాదు ॥

# పరమార్థదర్శనము

తే॥ గీ॥ చిత్తమును పుట్టలేదు యీ చిత్తదృశ్య
ములును పుట్టుటయేలేదు పూర్ణమైన
బ్రహ్మమొక్కటె యేకమై వరలుచుండ
గన నవిద్యనె యివియెల్ల గలుగుచుండు ॥ 20

తే॥ గీ॥ ద్రష్టయును ద్రష్టచిత్తంబు దాని దృశ్య
వ మెల్ల నవిద్యచే బ్రజ్వరిల్లు
వానికిని జూడ పరమార్థభవము లేదు
స్వప్నమును బోలియుండు నీ జాగరంబు॥ 21

తే॥ గీ॥ పాన్పుపై కాయమొక్కటి బవ్వళింప
నన్యకాయంబు స్వప్నమం దలరు గాదె?
కలనుదోచెడి కాయంబు గరచిజూడ
చిత్తకల్పితమేయని చెప్పవలయు ॥ 22

తే॥ గీ॥ తనర గగనంబునందున తరలినట్లు
తనదు నౌకను నెవ్వడో తరిగినట్లు
బ్రహ్మభావంబు తానెట్లొ బడసినట్లు
చూడ కల నవి యెల్లను మాన్యతయుతె ॥ 23

॥ గీ॥ గనగ సూక్ష్మంబునైనట్టి కాయమధ్య
భాగ మందున జూడమే పలువిధములు
స్వప్నమందున దోచెడి వస్తుసమితి
సత్యమేయన్న నివియెట్లు సత్యములగు ॥ 24

# పరమార్థదర్శనము

తే॥ గీ॥ కాయమధ్యంబు నందున గలుగరాని
వస్తువర్గంబు జూడమే స్వప్నమందు
నివియు సత్యములేయన్న నెటులనుండు
నరమసూక్ష్మంబు నైన యిబ్భాగమందు ॥ 25

తే॥ గీ॥ స్వప్నమునదోచు నీ దృశ్య వర్గమెల్ల
చిత్తకల్పనయే యని చెప వలయు
లేదు పరమార్థముగ స్థితి దుభవను
చిత్తమే దృశ్యవర్గమై జెలగుచుండు ॥ 26

తే॥ గీ॥ ద్రష్ట చిత్తంబు దృశ్యంబు తగునె చెపుమ
సత్యములటంచు బల్కంగ స్వప్నమందు
నటులె జాగరమందున నౌనుగాదె ?
స్వప్నమును బోలియుండు నీ జాగరంబు ॥

తే॥ గీ॥ చిత్తము చలింప ద్రష్టయు జెలగుచుండు
చిత్తము చలింప దోచునీ చితదృశ్య
మెపుడు చిత్తంబు దృశ్యంబు బలెదష్ట
దోచుచుండునో సంసృతి దోచునపుడె ॥ 28

తే॥ గీ॥ ద్రష్టృ దర్శన దృశ్యాదె దంబిదెల్ల
స్పందితంబైన చిత్తంబు వలన గలుగు
స్పందితముగాని చిత్తంబు నందులేవు
ద్రష్టయును దృశ్యమును మఱి దర్శనంబు ॥ 29

# పరమా దర్శనము

తే॥ గీ॥ సుప్తియందున చిత్తంబు చూడబడమి
ద్వైతమటలేదు కలదు యద్వైత మందు
స్వప్నజాగరములయందు వరలుచిత్త
మందువల్లనె ద్వైతంబు అచటదోచు ॥ 30

తే॥ గీ॥ గ్రాహ్యగ్రాహక రూపమై గానుపించు
నట్టి యీ ద్వైత మిబుల జూ పట్టుతెల్లి
స్పందితంబైన చిత్తంబు వల్లనగుట
చిత్తకల్పిత మిదియని చెప్పవలయు ॥ 31

తే॥ గీ॥ ఆత్మయందున కల్పిత మైనయట్టి
చిత్తమున కల్పితంబయ్యె చిత్రజగము
ఆత్మమాత్రంబుగాదోచు నఖిలజగము
చిత్తమునులేదు చిత్తసృష్టియును లేదు ॥ 32

తే॥ గీ॥ చిత్తమున ద్వైతభావంబు జేరినంత
చిత్తము చలించి కల్పన జేయుచుండు
చిత్తమున ద్వైతభావంబు జేరదేని
చిత్తమునులేదు చితసృష్టియునులేదు ॥ 33

తే॥ గీ॥ ఘటము మృత్తికయందున గలిగినట్లు
బ్రహ్మమందున విశ్వంబు ప్రభవమయ్యె
ఘటము మృద్భిన్నముగలేని కరణిజగము
బ్రహ్మభిన్నంబుగాలేదు బ్రహ్మమెయగు ॥ 34

# ప ర మా ర్థ ద ర్శ న ము

తే॥ గీ॥ ఆదియందున నంత్యంబు నందులేక
మధ్యగలయ జగమిది మిథ్యగాదె
మృణ్మయ ఘటంబు నందున మత్తికట్లు
సత్యమగు బ్రహ్మమొక్కటే జ మునందు ॥ 35

తే॥ గీ॥ రజ్జుసర్పంబు నందున రజ్జువట్లు
శుక్తిరౌప్యంబునందున శుక్తిపోల్కి
విశ్వమున బ్రహ్మమొక్కటే శాశ్వతంబు
వితథమగు బ్రహ్మభిన్నమౌ విశ్వమెల్ల ॥ 36

తే॥ గీ॥ రజ్జుసర్పంబు భ్రాంతిచే రాజిలునటు
బ్రహ్మమున దోచు విశ్వంబు భ్రాంతిచేత
భ్రమనివర్తింప రజ్జురూపంబు మాడ్కి
బ్రహ్మమేదోచు దొరగు ప్రపంచబుద్ధి ॥

తే॥ గీ॥ చూచునది చూడబడునది చూపు యనెడి
మూడునుంగూడ యీ బ్రహ్మమొకటెగాని
బ్రహ్మమునకంటె భిన్నమౌ వస్తువొండు
సత్యముగలేదు యిది శ్రుతిసమ్మతంబు ॥ 38

తే॥ గీ॥ స్వప్నమందున స్వప్నంబు సత్యమయ్యు
మెలకువను పిమ్మటను నది మిథ్యగాదె
అటు లవిద్యావినిద్రున కకిలజగము
సత్యమయ్యును నెఱుక నసత్యమె యగు ॥ 39

# పరమార్థ దర్శనము

తే॥ గీ॥ వెలుగు దోపంగ చీకటి విరిసిట్లున
విద్యచేత నవిద్య తా విరిసిపోవ
స్వప్నవస్తువు పోలిక సర్వజగము
మిథ్యగా దోచుచుండు ప్రబుద్ధునకును ॥ 40

తే॥ గీ॥ స్వప్నమయుడగు జీవుండు జననమొందు
మరణమును బొందు నటులె జాగరితుడైన
జీవుడును పుట్టువును బొందు చావునొందు
నంతియేగాని పరమార్థ మంతుగాదు । 41

తే॥ గీ॥ ఐంద్రజాలికవిద్యచే నైనజీవు
డెటులజన్మించి మృతినొందు నటులజీవు
లందఱును జన్మమృత్యువుల్ బొందుచుందు
రంతియేగాని పరమార్థ మందుగాదు ॥ 42

తే॥ గీ॥ వాస్తవిక దృష్టి జూడనే వస్తువైన
పుట్టదెన్నండు నటువలె గిట్టదెపుడు
బంధమోక్షంబు లనునవి భ్రాంతిభ్రమలు
అవి యవిద్యనశించిన యంతదొలగు ॥ 43

తే॥ గీ॥ వినుమనాదియగుచునైన యవిద్యచేత
నిద్రితుండైన జీవుండు నిద్రనుండి
యెపుడు మేల్కాంచు నాతండు సత్యముతెలియు
నజము నస్వప్నమునైనది దాత్మనంచు ॥ 44

# పరమార్థ వర్ణనము

తే। గీ। స్వప్ననిద్రలులేని సుషుప్తిలేని
నిత్యపరిపూర్ణ ప్రత్యక్కు నేనటన్న
బోధమయదృష్టి గలుగు ప్రబుద్ధునకును
ద్రష్టృదర్శన దృశ్య భేదములు లేవు ॥ 45

తే। గీ। ఆదాయంబు లేక మమృతంబు సహజమునైన
బ్రహ్మమే నేను చిత్స్వరూపంబు నేను
నిత్యనిరుఃఖుఁడను నేను నిర్మలుండ
నంచు ఱుఁగంగ కేవలు డౌనతండు॥ 46

తే। గీ। పుట్టుకయునులేదు పొలియుటయునులేదు
మోక్షకామి లేడు ముక్తిలేదు
సాధకుండులేడు సాధనయును లేదు
సత్యమిదెయె శ్రుతికి సమ్మతంబు ॥ 47

తే। గీ। సర్వమును నాత్మగాజూచు జ్ఞానిదృష్టి
కఖిలమును మిథ్యగా దోచు నాత్మయొకటె
క్రింద మీదను సందుల గొందులందు
నిండి సర్వత్ర వెలుగొందుచుండు నెపుడు ॥ 48

తే। గీ। చూడబడునది చూచెడి వాడనియెడి
భేదభావంబు యెవనికీ విశ్వమందు
తోచ దాతండె నిత్యని ర్దుఃఖుఁడతడు
మోహశోక భయంబుల బొందదెపుడు ॥ 49

# పరమార్థదర్శనము

తే॥ గీ॥ సర్వమును బ్రహ్మమేయను జ్ఞానదృష్టి
గల్గువానికి యుత్క్రాంతి గలుగ దతడు
క్షయము నొందంగ ప్రారబ్ధ మాత్మమాత్ర
డగుచు వెల్గుచు కేవలు డగుచు నిల్చు॥ 50

తే॥ గీ॥ ఇదియె పరమార్థ దర్శనం బిదె రహస్య
మిదె యవిద్యా వినిద్రున కెఱుక పడని
బోధమయ దృష్టి దీని ప్రబుద్ధుడౌకడె
పొందనేర్చును యిదియె ప్రబుద్ధమతము॥ 51

। గీ॥ శ్రీనివాసుండు హితమతి జెప్పినట్టి
తత్త్వమిది యౌపనిషదంబు త్యక్త చిత్త
దోషులు పఠింప దగినది దొడ్డదైన
బుద్ధిగల మోక్షకామియే పొందు దీని॥ 52

పరమార్థదర్శనము. సమాప్తము

శ్రీరామచంద్రార్పణమస్తు

శ్రీరామ కృష్ణ సోదర శ్రీనివాస ప్రణీతము

ఓమ్

శ్రీరామాయనమః

# ధ్యానపంచకము



ధరణిజాపతే భువనభూపతే

త్వమసిహృత్పతే హృదయభైవమే ౧

ఓ సీతారమణా! జగత్ప్రభూ! హృదయపరిపాలకా! నా హృదయ ప్రకాశమే నీస్వరూపమై యున్నది.

త్వత్ప్రవేశతో హృత్తమోఽగలత్

సహజభైవతే లసతిమేహృది ౨

ఓ సీతారమణా! నీవు నా హృదయమును ప్రవేశించుట వలన హృదయమందలి అజ్ఞానమనెడి చీకటినశించినది. నీ సహజప్రకాశమే నాహృదయమునఁ బ్రకాశించుచున్నది.

కరుణయాహితే విగతసంశయ

స్త్వనుభవామిభో విమలచిత్సుఖం ౩

ఓ స్వామీ! నీకరుణచేత (నాస్వరూపమునుగూర్చిన) సంశయము పోగొట్టఁబడిన వాఁడనై పరిశుద్ధమగు చిత్సుఖము ననుభవించు చున్నాను.

రఘువర తే హృది స్ఫురతి శైవమే
సహజరూపమూర్తిభిదా సంవిదాఽగలత్. ౪

ఓ రఘువంశశ్రేష్ఠా! హృదయమందిప్పుడు నాయొక్క (సహజ) రూపమే స్ఫురించుచున్నది. జ్ఞానముచేత నేనుదానికిని (సహజస్వరూపమునకు) సత్స్వరూపమునకును భేదము జారిపోయినది.

మామకహృది స్థిత స్త్వం కృపామయ
స్వ[illegible]జసంస్థితౌ ఘటయ పూర్ణతాం ౫

(ఓ రామా!) కృపామయుఁడవైన నీవు నా హృదయ మందున్నవాఁడవై (ఆత్మనుగూర్చిన) సహజ నిష్ఠయందు నాకు పూర్ణత్వమును గలుగజేయుము

స్తుతిరియం కృతా భవభయాపహా
శ్రీమహాసనాదాన్న ముముక్షుణా ౬

సంసారభయమును పోగొట్టునదగు ఈ స్తోత్రము శ్రీమహాసనాదను ముముక్షువుచేతఁ జేయఁబడినది.

ధ్యానపంచకము
సమాప్తము.

ఓం

# సహజనిష్ఠా

ద ష్టృతాకుత స్వయమస్యది
స్వస్వరూపవిత్ స్వ తో భవేత్ ॥ ౧

తానులేకున్నదా దృష్టియెట్లగును?
తానెన్న దనరూపు దా స్వ ుఁడగును॥ ౧

శ్రోత్రాదీంద్రియ వ్యవహారములును వాగాదుల క్రియలును మనోబుద్ధి చిత్తాహంకారములను అంతఃకరణ చతుష్టయ వ్యవహారములును ప్రాణాదుల చేష్టలును సుషుప్త్యవస్థా సంబంధములగు సుఖిత్వజడత్వాదులును తనకు తెలియఁబడుచున్నవిగదా! తాను చూచువాఁడు కానియెడల ఈ సర్వవ్యవహారములును తనకెట్లు తెలియును?

తాను లేనియెడల చూచుటమాత్ర మెట్లు సంభవించును? కావున ఆత్మ లేదనువారి వాదము నిరాధారమైనది.

ద్రష్టయగు తనయొక్క స్వరూపమేదియని విచారించి తెలిసికొనిన వాఁడు తనయందే నిలకడ గలవాఁడగుచున్నాఁడు.

| | |
|---|---|
| ద్రష్ట్రత్వాదాత్మనో | తనువుకు ద్రష్టయై |
| యదితనోఃపృథక్ | తానున్న యెడల |
| తనుగతజ్వరా | తనుతాపమెన్నఁడు |
| న్నాను సంజ్వరేత్ ॥ ౨ | తనకుండబోదు॥ ౨ |

తెలియఁబడుదానికంటె తెలియువాఁడు వేఱను వివేక జ్ఞానముచేత తెలిసికొనువాఁడగు తాను తెలియఁబడునదగు శరీరముతో కలియక (అనగా తెలియఁబడునదగు శరీరమున కంటె తెలిసికొనువాఁడగు తాను వేఱను నిశ్చయజ్ఞానముతో) తనశరీరము నన్యుని శరీరమును వలె వేఱుగ గ నెంచుచున్న యెడల శరీరసంబంధములగు తాపములు తన్ను తపింపఁజేయఁజాలవు.

| | |
|---|---|
| మనస ఆగమా౽ | మనసుకు ద్రష్టయై |
| నాగమౌ స్వయం | మరువక యున్న |
| పశ్యన్నో మనః | మనసు చలించదు |
| స్వస్థానాన్న ప్రచలేత్ ॥ ౩ | తనతావు నుండి॥ 3. |

మనస్సు, మనస్సుయొక్క వ్యవహారములు తనకు తెలియఁబడుచున్నందున, తానుమనస్సును దాని వ్యవహారములను చూచువాఁడేగాని, మనసుగాని మనోవ్యవహారములతో సంబంధము గలవాఁడుగాని కాదని నిశ్చయించు

కొని తన సహజద్రష్టృత్వమును మఱవక మనస్సుతోఁగాని మనోవ్యవహారములతోఁగాని కలియక వేఱుగ నిలచి, మనస్సుయొక్క రాకపోకలను నిలుకడతో గుర్తించుచున్న యెడల అది తనంతనే నెమ్మదినొందును.

| | |
|---|---|
| అహమ ఆగమం | నేనను వృత్తిని |
| పశ్యతస్స్వయం | నిష్ఠతో నరయ |
| స్వప్నతేప్యహం | నేననునదియె స్వ |
| పతతిచధ్రువం॥ ౮ | స్థానమునఁబడు॥ ౮ |

(వ్యవహార కాలములయందు సైతము మనస్సుతో కలియక, విలక్షణముగనుండి మనోవ్యవహారములకు ద్రష్టయై యుండఁగల నిలకడ సిద్ధించిన పిమ్మట నేనను వృత్తికి ద్రష్టయై నిలచి, దానితో కలియక వేఱుగ నున్నవాఁడై అహం వృత్తిని నిలుకడతో గుర్తించు చున్న యెడల అదియు తన స్థానమందే పడిపోవును.

| | |
|---|---|
| స్వస్యవిస్మృతే | మఱపును నిద్రను |
| స్తమసఆవృతేః | మఱవక యున్న |
| ద్రష్టృతాఽస్తిచే | రమైన నిలుకడ |
| ద్భవతిసంతతిః॥ ౯ | జేకుఱు నిజము॥ ౯ |

మనస్సునకును నేనను వృత్తికిని ద్రష్టృత్వము నభ్యసించుకాలమున నేనుద్రష్టననెడి జ్ఞానమును మఱచుటగాని

ద్రష్టయగు తాను ద్రష్టనని వ్యవహరించెడి అంతఃకరణవృత్తిగాక, ఆయంతఃకరణవృత్తికి ద్రష్టృత్వము ననుగ్రహించిన దృక్స్వరూపాత్మ యని నిశ్చయించి గొప్పనిలుకడతో అందు విశ్రమించి యున్నవానికి అంతకన్న చేయఁదగినది మరేమియును లేదు.

స్వ లేస్వయం
తిష్ఠతో మునేః
సంసృతేర్భయం
నహికదాచన॥ ౮

స్వ లంబున నున్న
సన్మౌని కెపుడు
సంసృతిర్భయము; లే
శంబైన లేదు॥ ౮

భేదమును భావించుటచే నుభ్రాంతియు తన్మూలమున మరల దేహధారణమును గలుగుచున్నది. స్వస్వరూపమందు భేదభావనారహితమగు మౌనముతో విశ్రమించి యున్నవానికి ఒకప్పుడును జననమరణ భయములేదు.

సహజసంతే
రయమహాక్రమః
శ్రీనివాసనా
మ్నాప్రచోదితః॥ ౯

సహజసంతతికి నీ
సాధనక్రమము
మహి శ్రీనివాసుఁ[illegible]
మహితమా[illegible]యనె॥ ౯

స్వస్వరూపమును గూర్చిన సహజని[illegible] నభ్యసించుట యందు ఈపద్ధతి చాలమంచిది ఇది శ్రీ[illegible]సునిచేత చెప్పఁబడినది.

కం॥ ఆచార్య పీఠమెక్కిన
యాచార్యుల విశ్వగురుల నాత్మజ్ఞుల నే
నాచార్య సాంప్రదాయుల।
ప్రాచీనుల నేటిగురుల-ప్రస్తుతి సేతున్। 5

కం॥ పరవిద్యను నేర్పిన మ
ద్గురువర్యుని రామకృ -గుణనిధిని సహో
దరుని పదాబ్జంబుల నే।
నిరతము ధ్యానింతుమది పు-నీతము గాగన్॥ 6

## ధ్యానము సమాప్తము

ఆ॥ వె॥ స్వానుభవవిధంబు చక్కఁగా వివరించి
జ్ఞాన దార్ఢ్యతకుఁ బ్రధానమైన
వాస్తవికపుదృష్టి వరలుటఁ గల్పించె నేఁడు
పలుకువాద శ్రుతుల తలపు తీరు ॥

ఏమని వచింతు నా తి నెవఁడెఱుంగు
నిరతిశయ నిత్యసుఖమున నిలిచి మౌన
సేంద్రియాతీత సహజాత్మ వృత్తిని గాని
యున్నవాఁడ నిజ తిం గన్న నేను. 15

స్వానుభవపథంబు సచ్ఛిష్య సేవ్యంబు
సద్గురూపదేశ సంగ్రహంబు
శ్రీనివాస హృదయసీమ సంజనితంబు
బోధసారమిది ప్రబుద్ధగీత. 16

ద్వంద్వాతీత తి ప్రకరణము
సమాప్తము
శ్రీ రామకృష్ణ సోదరుఁడగు శ్రీనివాసునిచే
రచియింపఁబడినది.

ఓం తత్సత్
ప్రబుద్ధగీత సమాప్తము.



నిద్రవచ్చుటగాని సంభవించును. అట్టిసమయమున తన్నావరించిన మరపునకును నిద్రకును ద్రష్టయై నిలచి వానిని నిలుకడతోఁ గుర్తించుచున్నయెడల అవిరెండును నశించి మంచి నిలుకడ సిద్ధించును.

| | |
|---|---|
| ద్రష్ట్రాలోకతో౽ | ద్రష్టృతబుట్టు నా |
| ర్తిం చిన్వతః | నము వెదుక |
| స్వోపదేశతః | స్వ లంబున గల్గు |
| స్వభావేనాత్మనః॥ ౬ | సం తి దనకు॥ ౬ |

మనస్సునకును అహంవృత్తికిని నిద్రకును, మరపునకును ద్రష్టృత్వము సాధించిన మీఁదట) నేను ద్రష్టనని వ్యవహరించెడి దృశ్యముగు నంతఃకరణవృత్తికి ద్రష్టనై యా యంతఃకరణవృత్తికి ద్రష్టృత్వమును ప్రసాదించిన దృశ్యరహిత దృక్స్వరూపా యుండునపుడో టెక్కుడయని మరపునకును నిద్రకును లోనుగాని సహజద్రష్టృత్వముచేత నన్వేషించిన యెడల మనస్సు, అహంవృత్తి, మరపు, నిద్ర, లేని సహజదృక్స్వరూపాత్మయందు విశ్రమించుచున్నాఁడు.

| | |
|---|---|
| దృశ్యత్వముక్తికం | స్వ తిగని యుచ్చ |
| స్వస్థితేర్ద్వయః | సం తియందు |
| స్వోచ్ఛసంస్థితో | స్వ తంబడసిన |
| స్వస్థభావంవినా॥ ౭ | బనిలేనివాఁడు॥ ౭ |

ద్రష్టయగు తాను ద్రష్టనని వ్యవహరించెడి అంతఃకరణవృత్తిగాక, ఆయంతఃకరణవృత్తికి ద్రష్టృత్వము ననుగ్రహించిన దృక్స్వరూపాత్మ యని నిశ్చయించి గొప్పనిలుకడతో అందే విశ్రమించి యున్నవానికి అంతకన్న చేయఁదగినది మరేమియును లేదు.

| | |
|---|---|
| స్వ లేస్వయం | స్వ లంబున నున్న |
| తిష్ఠతోమునేః | సన్న్యాని కెపుడు |
| సంసృతేర్భయం | సంసృతిర్భయము; లే |
| నహికదాచన॥ ౮ | శంబైన లేదు॥ ౮ |

భేదమును భావించుటచే నుత్క్రాంతియు తన్మూలమున మరల దేహధారణమును గలుగుచున్నది. స్వస్వరూపమందు భేదభావనారహితమగు మౌనముతో విశ్రమించి యున్నవానికి ఒకప్పుడును జననమరణ భయము లేదు.

| | |
|---|---|
| సహజసం తే | సహజసం తికి నీ |
| రయమహార్క్రమః | సాధనక్రమము |
| శ్రీనివాసనా | మహి శ్రీనివాసుండు |
| మ్నాప్రచోదితః॥ ౯ | మహితమార్గ మనె॥ ౯ |

స్వస్వరూపమును గూర్చిన సహజనిష్ఠ నభ్యసించుటయందు ఈపద్ధతి చాలమంచిది ఇది శ్రీనివాసునిచేత చెప్పఁబడినది.

స్వ చేతసం నమ్రచేష్టితం
సోదరంవిదం నౌమితంగురుం॥

సహజనిష్ఠా సమాప్తా
శ్రీరామకృష్ణస్య సోదరేణ
శ్రీనివాసేన విరచితా.
ఓం తత్సత్.

శ్లో॥ పంశేతు పొన్నలూర్ నామ్ని, సంభవా శ్రీమతాంగృహే
రమణాఖ్యస్యయాపత్నీ వివేకవిభవస్యచ॥ ౧

శ్లో॥ కొండూరువంశవారాశే రమ్యతాంశోశ్చయస్యచ
మాతాచ వేంకయాఖ్యస్య సౌహార్ద హృదయాన్వితా॥

శ్లో॥ యుక్తాయుక్త వివేకజ్ఞా ప్యృదారగుణశోభితా
ఆస్తిక్యభావసంయుక్తా వరాసుందరమాంబికా॥ 3

శ్లో॥ లఘుగ్రంథమిమంకర్తుం ముద్రణం స్వయమేవసా
ద్రవ్యం ప్రాదాన్నపృష్టాఽపి బ్రహ్మార్పణమనీషయా॥ ౪

ఓం తత్సత్.



